
సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050015393

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీరస్తు.

శ్రీరామచంద్రాయనమః

# రామశతకము



ఎడిటర్ అండ్ పబ్లిషరు

కోనం చినపుల్లయ్య

రామన్నగూడెం

గోపాలపురం పోష్టు, పోలవరం తాలూకా.

లక్ష్మీనరసింహగుప్తాప్రెస్, రాజమండ్రి.

1932

శ్రీరస్తు.

# శ్రీ రామ శతకము.

1 ముందుగ నిను దలచిన పని
అందముగా సఫలమౌను అందుకనే నిను
ముందరు గొలచెదరయ్యా నిను
వందనమిదె మ్రొక్కుచుంటి వో గణనాథా

2 చేయుదు రెందరు పండగ
పోయుదు రిండ్లాళ్ళు నీకు ముందుగ మెప్పున్
కాయము కడ పని మూడక
హాయిగ మరిపింపుమయ్య ఆ శగనేశా.

3 మ్రొక్కితి నిక్కముగా నీ
చక్కని బొజ్జకుని గుజ్జ రూపంబునకున్
మ్రొక్కితి గురు పాదములకు
మ్రొక్కితి శ్రీహరి కిప్పుడె మక్కువతోడన్.

4 నరహరి నెప్పుడు మదిలో
మరువక స్మరియించునట్లు మది కెక్కించి
కరుణతో శ్రీహరి కథలే
ధరణిని బోధించుమయ్య దైవగణేశా.

5 శ్రీరాముని శతకంబని
ఆరాముని నమ్మి ఆత్మకానందముగా
పారాయణ జేయను బహు
కూరిమితో వ్రాసియుంటి గుణబుధ రామా.

6 పుల్లయ జేసిన శతకం
బొల్లలుగా పిల్లలంత బోని బోని చదువన్
వుల్లాసము వుప్పొంగును
నల్లని యాస్వామినెపుడు నమ్ముటకొరకై.

7 గురు బోధను శ్రీరాముల
కరుణకు నే పాత్రుడైతి ఘనముగనాకున్
మరువకు రామాయని మది
స్మరియించుచు నుండు మనెగ స్వామీ రామా.

8 రామ విరామా యనుచును
ప్రేమతో నీనామమెపుడు నాహృదయమున్.
వేమరు వేడెద మరినా
తామసములు ద్రుంచు కొరకు దశరధ రామా.

9 నీకృపచే లోకములో
యీకవినే జేయగల్గి తంతియెగానీ
నాకై నే జేయుదమన
వాక్కైనను రాదు సుమ్మ వసుధలో రామా.

10 ఏ ప్రొద్దును ఎడబాయక
నీపైనే బుద్ధికుదిరి నినుస్మరియించగ
యీప్రొద్దు వరములివ్వక
నా ప్రొద్దులు గడుపుమయ్యా నయముగ రామా.

11 జ్ఞానము లేకను భువిలో
మానవ జన్మంబుయెత్తి మరిమరి భ్రమలన్
పానము చేయుచు తిరిగితి
కానక నీమహిమలిలను కలియుగ రామా.

12 దాసులకు దాసుడను నా
దోషములను పారదోలు హోపరమేశా
మోసము చేయుట తగదిక
ఆశతో నిను వేడుచున్న అవనిలో రామా.

13 కలియుగ జనులందరు నిను
వెలయగ రాముండు మనకు దేముండనగా
యిల నిన్నుం విడువకను నే
పలువిధముల వేడుచుంటి భ్రమతో రామా.

14 బాలుడనే నీ మాయల
దోలను నేనెంత వాడ దోషరహిత ఆ
కాలుని పాల్ సేయకనను
నేలుము లోకేశ దాసపోషక రామా.

15 వచ్చితివో రఘురామా
నిశ్చయముగ నీదుగుడికి నిను గొల్చుటకై
రక్షించెదు గారమ్మని
ముచ్చటలాడంగ నగనమురహరిరామా.

16 నమ్మితి వరహరి నినునే
నమ్మితి శ్రీరామచంద్ర నను బ్రోవుసామీ
నమ్మితి నామదిలో నీ
నామ మహరి నమ్మియుంటినయముగ రామా

17 చేసితి వ్యవసాయము వీడ
జాసితి పరదైవములను గాంచగయిపుడా
ఆశయు విడనాసి నన్నె
ఆసించితి అవనిలోన హరిశ్రీరామా.

18 గొల్చితి గంగానమ్మల
వల్చితి నింతవరకు ప్రియముగవాటికి
తెంచితి జీవాల నేకము
ఎంచుటకై నలవి కాదు ఎన్నో రామా.

19 కోసితి గొర్రెల మేకల
కోసితి యిటువంటికోళ్ల పందులనెన్నో
చేసితి హింసల నేకము
దోషంబని యెంచనైతి సుంచిగ రామా.

20 కష్టముల కోర్చియైనను
నిష్టతో శ్రీరాము నెవ్వుడు నిర్మలమదిచే
సృష్టిని కనుగొనవలెనని
యిష్టమునా కయ్యేమదిని విధిగా రామా.

21 కర్మముల ననుభవించుచు
మర్మము లేకుండమదిని మహాభక్తితో భువి
ధర్మము తప్పకనడిచిన
నిర్మల మైనట్టిజీవె నినుగను రామా.

22 అన్నము లేకున్ననుభువి.
జన్మమునకు బాధలేదు జగతిలోవినురా
మన్నను ఆత్మలోనుంచిన
ధన్యుడెపోవాడు నిజముదశరధ రామా

23 ఎందరిగితి వో దేవా
వందముగానీకు. మొక్కి వందనమంటిక
సుందరనాయక ననునీ
మందిరమున జేర్చరావెమాధవ రామా.

24 రమ్మని వేడితియికనా
కర్మములను ద్రుంచమంటి కలియుగమునసీ
సొమ్మని అంటినిమరినీ
సమ్మతితో నన్నుబ్రోవు సరగున రామా.

25 గోవిందయనుచు నెప్పుడు
భావము నందలచువారి బాధలుయిలలో
లేవనగ భువిని నేవిని
నీవే దిక్కనుచుయుంటి నిజముగ రామా.

26 రామా రామా రఘుకుల
సోమా శ్రీరామా రామా వోగుణధామ
ఏమని వేడినగానీ
కోమలరూపంబె జూపవేమిర రామా.

27 సరసము గాదికనరహరి
వరుసగ ప్రహ్లాదరీతి వైకుంఠముసీ
సరసక నన్నుక గురువును
మరువక దరిచేర్చవేగమాధవ రామా.

28 మాయిగిమానవ జన్మంబె త్తి
మాయను ఖండించలేక నినుగనలేకా
కాయమె శాశ్వతమనిభువి
న్యాయంబులె వదలిబ్రతుక నేర్చితిరామా.

29 భద్రగిరి శిఖరమందున
భద్రముగా వెలసి రామభద్రుడనంచుక
నిద్రలో దమ్మకకునీవు
కుద్దునకనబడితివటగ ముద్దులరామా.

30 ఎందెందు యేడవిన్నను
అందముగా నిన్నె ప్రిజలు హరిహరియనుచున్
సందేహ మెందు లేకను
పొందుగ నినెనమ్మినుండె అందరు రామా.

31 నీదాస దాసులయిల
నేదానుండనుచు మిమ్ముదలచుచునుంటిన్
నాదోష మెల్ల ద్రుంచిక
నీదాసుని జేయవేల నిజముగ రామా.

32 హేరామా హరేరామా
వోరామా నన్ను బ్రోవు మోరఘురామా
శ్రీరామ నిన్నె మదినే
పారాయణ జేయుచుంటి భక్తితో రామా.

33 శ్రీరంగ రంగరంగా
హోరంగాయనుచు నిన్నుఆత్మలో యెపుడున్
కోరంగ ధరణి నిన్నిలు
దూరంగా నుంచనేల మంచిగ రామా.

34 ఎత్తితి నావిధి జన్మము
సత్తుగ నీనామ స్మరణ సర్వవేళలన్
ముక్తికి ప్రార్థించెదనని
భ్రాంతితో నినువేడుచున్న బాగుగ రామా.

35 కలియుగ మంతయు కల్లని
పలుతెరంగులముక్తికొరకు బాధలుపడువా
రిల నెందరెందరో తప
ముల జేయుచు నుండె వేలతపసులరామా.

36 నినునమ్మి నీచవృత్తుల
మనకికనవి కూడదనుచు మదిలోనుంచీ
కొని గొన్ని మానిగావ్రా
యని నిన్నె దలచుచుంటి అవనిలోరామా.

37 ఈరామ భక్తి చేతను
కారాడిన మనుజులెల్ల కలియుగమున శ్రీ
నారాయణ పదవి కనుగొన
వేరే మరియడ్డు లేదనగారామా.

38 హరియని ప్రహ్లాదుడప్పుడు
నరహరినే నమ్ముకొనగ నాతని తండ్రా
హరిశబ్దం విడువమనియూ
ధరనెన్నో బాధపెట్టె తన్నగరామా.

39 దండించిన తండ్రికిమరి
మొండియునై హరినెనమ్మి మోక్షముచేరన్
ఖండింపులు కశ్యపు నిల
చెడిన నరమృగముకావె చెప్పుమురామా.

40 భక్తుని బాధలకోర్వక
ఉక్కడి స్తంబంబు నందు ఉద్భవమైనీ
చక్కనిగోళ్ళతొ రాక్షస
డొక్కలు చీరంగలేః గ్రక్కునరామా.

41 స్థిరముగ శివునకుపూజలు
మరువక నిలజేసి నట్టిమార్కండేయుం
డరయగ యమకింకరులను
తరమెనుగా భయములేక దశరథరామా.

42 పాశము వేసిక నినునే
వాసిగపట్టెదను చూడుమనిఆ యముడున్
రోషముతో వచ్చిపోరెను
దాసుని చేపట్టలేక తరలెను రామా.

43 కలిమాయ కాన లేకను
యిలసౌఖ్యముజూచి విర్రవీగితిగదనా
కలలెన్నో బాధలిప్పుడు
దలపక రక్షింప నెవరుధన్యులు రామా.

44 అష్టయిశ్వర్యముగలడని
సృష్టినినిక మరచి చాలసుఖపడుచుంటిక
కష్టములొందవెను యిప్పుడు
నష్టం బౌనేమొ పాణినమ్మితిరామా.

45 తప్పక రామాయికనీ
కెప్పుడు నే సేవకుండ నెయ్యెడ నైన
ముప్పులు నేనిక జేసిన
తప్పుల కన్నిటికి నీవేతండ్రివి రామా.

46 ఈశ్వర సెలవైనప్పుడు
ఆశను విడువంగలేక అయ్యోబాబో
మోసము శాయకునన్నని
వాసిగ భువినేడ్పుబెల్ల వట్టిది రామా.

47 భక్తికి ముక్తికినీవే
శక్తికి నాక్షేమమునకు శంకరనీవే
ముక్తికి చక్కగయికనా
వాక్కుని మాతృంబు గావుమోరఘురామా.

48 వెళ్ళెద పట్నము యిప్పుడె
మళ్లీవచ్చెదనో లేదో మాధవకృష్ణా
యెల్లప్పుడు నీ సేవయె
చల్లగ సంప్రాప్తి శేయు సద్గుణ రామా.

49 అయ్యా గురువర్యా మిము
వెయ్యారుగ నమ్మియిపుడె వెళ్లుచునున్నా
పొయ్యెన ప్రాణము ! బొందిని
చయ్యన పడగలదో లేదో సెలవిదెఅయ్యా.

50 తనువులు శాశ్వత మనిభువి
ననుకొని తిరిగేటి ప్రజలు తప్పకనరకం
కనుగొని కాలుని బాధల
మనుచుంటరమె నిజము నిజము మాగురువర్యా.

51 కయ్యము రామయ్యకునా
కియ్యెడనే విడగలేదు యికముందైనన్
కైయ్యేళ్లు మెన్ని జన్మము
లయ్యిన ఆరామభక్తు డయ్యెదనయ్యా.

52 వినలేవా సఖిరాముని
గనలేనే చెప్పబోవునది యికవినవే
మనవే గృహామందున నీవు
తనువుతోనె వెళ్లుచున్న తండ్రిని జూడన్

53 ఎన్నాళ్ళకైన చావే
వున్నది నరజన్మమునకు తిన్నగవినవే
కొన్నాళ్ళ తనువు లివియని
మన్ననతో రామభక్తి మరువకె చెలియా.

54 సతిగానిను చేకొంటిని
పతిగానే బరగుచుంటి బాగుగయిలలో
గతులెట్లుగలవో మనకిక
మతిచెడి నే పోవుచున్న సతియిటువినవే.

55 సతిపతుల సౌఖ్యమిలలో
హితవుగ జరిగేటి పంతువిధిగా వుంటే
సతివేగ ఖర్మ దొలగిక
పతిగానే వత్తు సుమ్మి భార్యావినవే.

56 పుట్టే టప్పుడె ఒకటై
పుట్టెనుగద జీవితోటి మట్టిది బామా
గిట్టేది చూచియుంటివ
యెట్టెట్టుల వెళ్ళిపోనో యేమెలలామా.

57 మనకిల్లు మధ్యనొక జత
పన్నగశయనుండుగూర్చె బ్రతుకుండనుచున్
కనుగొని చూడగకల్లది
అనుకొనినాజతకు నీవు అడలకె చెలియా.

58 నను గన్న తల్లె విడచెను
నిను నేపోషించుమాట నిజమనుకోకే
కొ కొన్ని దినములేమన
అనుపొందిక నమ్మ చెలియ అంతామాయే.

59 వచ్చెదవా నాతోటిక
కచ్చికి ఆకాలయముడుకరములు బట్టే
యిచ్ఛతో యీడ్చుకుపోగా
నిచ్చయముగ నన్నునమ్మి నిజముగనీవున్.

65 కరిమకరిచేత జిక్కియు
హరియని మరివేడ నిన్ను అపుడాకరినిన్
స్థిరముగ రక్షించియు నీ
పురమున జేర్చితివిగాదె హరి శ్రీరామా.

66 మృగమై పుట్టిన గజమే
పగతుని సాధించినట్లు బాగుగయిలలో
తగుమాత్ర భక్తిచే నీ
నగరంబున చేరెగాదె నయముగ రామా.

67 కృష్ణావ తారమై భువి
నిష్టముతో జన్మమెత్తి విధిగామామన్
నష్టంబుచేసి నయముగ
సృష్టిని పాలించునట్టి శూరుడ రామా.

68 పూతకినిను జంపుటకై
ప్రీతితో మరిపిల్చి పాలు ప్రియమునయివ్వన్
ఘాతుక వేషము కనుగొని
పాతకి నిలజంపినట్టి ప్రభుడవు రామా.

69 దొంగవు నీవే స్త్రీలను
భంగముగావించినట్టి ప్రభుడవు నీవే
మింగెను నీవే మీగడి
అంగయితే పాలుపెరుగు అన్నియు గామా

70 కట్టిన చీరెలు రవికెలు
గట్టున బడవైచి గొల్ల బొట్టెలుస్నానం
కట్టడిగ చేయగొలసులో
గిట్టక పోయెనుగ నీకు కృష్ణారామా.

71 చేపట్టి చీరెలన్నియు
ఆపట్టున పొన్న యెక్కి ఆనందముగా
రూపెట్టి కొమ్మలకుపై
కాపట్టినవాడెవండు కలియుగ రామా.

72 స్నానంబు చేసి చేడెలు
గానంబున వచ్చి కట్టు బట్టలు చూడన్
లేనందు చేత [illegible]లు
మానంబులు చేతమూసి మాధవదాసూ.

73 ఇదియేమి వింతవో చెలి
పదిలంబుగ చీరెలన్ని పరుడెవండో యిక
పదపడి యెత్తుక పోయెను
ముదమున మనకింక బ్రతుకు లేదన రామా.

74 ఆపొన్నపైని కూర్చుని
రూపంబుల నెంచి చూచి మోహిగనీవా
గోపికల గోలవినుచును
నాపనెయని నవ్వుకొనుచు నయముగ రామా.

75 పిల్లనగో లొకటుచ్చుక
మెల్లనగా పాటపాడ మేదినిస్త్రీలా
నల్లని వాడే వాడని
వల్లంతయు చంపి కడకు వచ్చెనురామా.

76 బుద్ధొచ్చె మాకుయిప్పుడు
బద్ధులమై యిటకు మాన భంగముకాగ
వద్దకు వచ్చియు కృష్ణా
ముద్దుగ మాచీరెలివ్వ మనగారామా.

77 చెయ్యెత్తి దణ్ణ మెట్టిన
కయ్యము విరాతోటి మాని కపటములేక
యియ్యెడ యిచ్చెదచీరెలు
బయ్యము లేదనెను కృష్ణు డయ్యారామా

78 మాధవ నీకిదె దణ్ణము
వాదము మాతోటి నీకు వద్దుగస్వామీ
నీదయ మామీఁదుంచియు
కాదనకను చీరెలివ్వు ఘనముగరామా.

79 అనివేడ గొల్లభామలు
వినయముగా భక్తితోటి ఘనముగకృష్ణా
ని[illegible]కిటుల జేసితి
వ[illegible] ణ్ణ మొప్పదనెగా రామా.

80 ఈలాటి వింతలెల్లను
చాలగ మీయందెగల్గె వేలకొలదిగా
మాలాటి మనుజులకుభువి
నేలాదుర్బుద్ధిపోను నేవిధి రామా.

81 తప్పులు గలవని నన్నిక
తిప్పలు పెట్టినను యింకదిక్కెవ్వరునీ
చెప్పున కొట్టిన పడుటకు
వొప్పుకునే నున్నతండ్రి వోరఘురామా.

82 నేరము చేసినబిడ్డల
దూరముగా తోలినట్టి దుర్మార్గుండే
వూరున వెదకిన కానడు
కూరిమితో కన్నతండ్రి గుణమిదిరామా.

83 కొట్టిన తిట్టిన విడువక
గట్టిగ తలిదండ్రికాళ్లె పట్టుక యేడ్చున్
వట్టోళ్ళ అండచేరున
సృష్టిని యెందయిన బాగచూడుమురామా.

84 అయ్యా రమ్మని పిలిచియు
నెయ్యన్నము పెట్టి చాలనేర్పున పెంచీ
బాగ్యము చెప్పిక జ్ఞానము
నియ్యెడ బోధించుతండ్రి నిజముగ రామా.

85 కోపంబుచేత గయునిక
గూపడగించెదనటంచు గాఢిగప్రతినన్
ఆపట్టుబూని కృష్ణుడు
చేపట్టి తుమార్పణంబు చేసెగ రామా.

86 దున్నవృతారము నీవయి
తన్నులుబడి దాసుచేత తిన్నగ వెళ్ళి
వెన్నునుజూపి కపీరుతో
తన్నును యిటు చూడుమనుట తగునా రామా.

87 నినుకాదు సుమ్మి రామా
పనిబూనిక వంపి ందు కనుభవమునాదె
మనసున కోపమునుంచక
ఘనముగ మమ్మేలుస్వామి కరుణతో రామా.

88 అయ్యా యెరుగని వారికి
యిమ్యెడ నీదర్శనంబు యీలాయిస్తే
దెయ్యము దేవరో యనుకొని
బయ్యముచే కొట్టనేమొ భక్తుడు రామా.

89 మాతల్లి సీతనడవికి
ఏతప్పును బట్టివిడచి యెడబాసితివో
ఆతల్లి బాధలడవిని
ఖ్యాతిగపడి కీర్తిగాంచె గాదెవో ..మా.

90 చండాలు డన్నమాటకు
వుండుటయిగ తగదటంచు వుచితార్థముగా
నిండైన గర్భిణుండగ
అండెవ్వరు లేక అడవికంపిన రామా.

91 మునిపత్నుల జూచెదనని
వెనకెప్పుడో అన్నమాట వున్నదివంకా
కనకిప్పుడు ఆవంకను
వనితను విడి రమ్మలక్ష్మణా యనరామా.

92 నీ కొల్లు ప్రాణ [illegible] ప్పను
యీకట్టడి కార్యమునకు విధిగా సీతను
వంకెట్టి అడవికంపను
శంకను జూచితివయేమి రాఘువ రామా.

93 యిష్టము లేకను లక్ష్మణ
కష్టముతో సీత నప్పుడు కానకు పంపీ
దుష్టుడనై యీ కార్యము
నిష్టతో చేజేయవలసె నిజముగ రామా.

94 అనియేడ్చి అడవినుంచిన
ఘనవార్తను అన్న     వినుపించన్
అని దుఃఖపడుచు రాముతో
వినుపించెను గుట్టివార్త విధిగారామా.

95 వనవాసము జేయుచునిక
కనె కుశలవ పుత్రకులనుగావనమందున్
మునియాశ్రమ మందుంచిన
ఘనముగ తాపెంచి విద్యగరపెనురామా.

96 విద్యనునేర్చిన బాలురు
యుద్ధమునకు సిద్ధపడిరి మధ్యనుమీతో
సాధ్యముగాకను గెలచుట
చోద్యముగా వంశముకిగి భ్రమసినరామా.

97 పుత్రులటంచు నుదెలసిన
మాత్రంబున దుఃఖ మొంది మాధవరామా
ధాత్రిని సీతను దోడ్కొని
ఖ్యాతిగ కుశలవులతోడ క్షేమమురామా.

98 శాపంబు చేత వనితకు
రూపంబును మారి రాయి రూఢిగ అయినా
పాపంబు బాసి పోయెను
నీపాదము దగిలినంత నిజముగరామా.

99 దశరధ రామా [illegible]
వసుధలో నా ఆజ్ఞ రాముడొసగిన రీతిగా
[illegible]
[illegible] నీకు [illegible]వ్రాసితిరామా.

100 కరుణతో యీశతకంబును
మరువక నిల భక్తవరులు మానక యెపుడున్
స్మరియించుచున్న రాముడు
వరమిచ్చియు బ్రోచుగాక వసుధలో రామా.

101 భద్రాద్రి రామ నీపై
ముద్దుగ పద్యములు వ్రాసి కొద్దిలో శతకం
ముద్రించి మూట గట్టియు
శ్రద్ధతో నీచేతికిస్తి చేకొను రామా.

102 నూటవక పద్యముల్ మూటయిదుగో రామా
కోటలోపల నున్న పాటకులకు
నోటిలోగొలుగుచును సూటిగా వ్రాసిన
మాటలే ముత్యాల మూటయిదుగో
పాటితప్పక యివిపాడుచుండిన వేళ
పాపముల్ దరితావు భద్రమూర్తి
వకళ్యాణమును లేక బాగుగా వినినంత
ఘనమైన బాధలు కడకు తొలగు

గీ॥ అందుకుని విప్పిచూడు వోసుందరాంగ
నింద నాపై వేయక ముందు ముందు
అందముగ వున్న నాకివే అర్పితంబు
పొందుగా నిన్ను వేడు జనులందరకును

సంపూర్ణము.

1 చుట్టుకీ ర్తన

1 వచ్చెదరా నాతో టిక ఘచ్చటాకటిమీాతో గల దొచ్చెదరా నాతో టిక
నిశ్చయముగ మీాపనియది । యిచ్చలేదు కొళ్ళెదమవ చ్చె

2 సుందరాంగి కొరకదుగా ॥ చూడు యెంత మందమ గా । ముందువిల్లు యెక్కుబెట్టిముక్కలుచేయుట మీాపనివ
3 విల్లు విరచి నట్టి వాడె అల్లుడనుచు పురిచాటె కల్లగాదువినుమా నాకు చల్లని పల్కులుమీారిపుడు॥వ॥
4 జనకుడనగ పేరెల్లను । జగతియందు తనపిల్లను వి ల్లు విరచినట్టి వాకిచ్చి పెండ్లి చేసెద నని ॥వ॥
5 అని చెప్పిన మునితోడను ॥ అరిగె రామలక్ష్మణు లును ఘనముగ యిల్లెక్కుబెట్టి । లాగివిరచె రఘురాముడు॥వ
6 ముందు వచ్చి కూర్చునె వా । రందరెల్లి నతివేగా నింద వచ్చె పందులమని । అందరిట్లు అనుకొనుచును ॥వ॥
7 రామలక్ష్మణుల బట్టి । రాసిరాసి నలుగెట్టి । పో సెనీళ్లుతల యంటి । జేసె పెండ్లి కొడుకులనగ ॥వ॥
8 సీతకు శ్రీరామునకు ఖ్యాతిపెండ్లిగాంచెను । మాత కు రామునిపై మల్లెపూల వర్షమప్పుడు । వచ్చెదరా